శ్రీశివనామమునిచే రచించిన

చిన్నకోట గోపాలమూర్తిగారిభార్య

# కామేశ్వరమ్మ చరిత్రము



శ్రీమదఖండ సచ్చిదానందమయుండును శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండునునగు భగవంతునిచే సృజియింపబడిన ద్వీపములలో నొక్కటియగు జంబూద్వీప భారతవర్షంబను భరతఖండంబున గౌతమమహర్షిచే శంకరు జటాజూటమునుండి తీసికొనిరాబడినదియును స్నానపానాదులచేతను దర్శనమాత్రముచేతను బ్రహ్మహత్యాది మహాపాపములను బోగొట్టబడినదియును నగు గౌతమీనదికిని దీనిపాయలలో నొక్కటియయి యజ్ఞానవంతుళౌశనదఖుండగు వశిష్ఠమౌనికులతిలకుని పేరట విలసిల్లు వశిష్ఠకును ఉభయగోదావరిమధ్యమున్న పుణ్యభూమియు సప్తగోదావరీతీరమని వన్నెకెక్కినక్షేత్రంబును చెన్నపురిరాజధానిలో

చేరిన గోదావరిజిల్లా రాజవోలుతాలూకాలోచేరిన గోపాల పురము అను గ్రామము యీ కామేశ్వరమ్మగారి స్థానము. ఈ గ్రామము శ్రీమత్ ఉప్పలపాటి వంశపయః పారావారరాకాసుధాకర వెంకటవిజయ గోపాలరాజా బహద్దరు బాఫియ్యతుబాపందు జమీనుదారువారి పరి పాలన గ్రామము అయియున్నది. ఈ గ్రామవాసులును ఆర్వేల నియోగిబ్రాహ్మణులునునగు పోతాప్రగడ అంక రాజుశర్మగారి ధర్మపత్నియు పతివ్రతాశిఖామణియునగు సుబ్బమాంబగర్భంబున జ్యేష్ఠపుత్రికారత్నంబై జన్మించి కామేశ్వరమ్మయను నామధేయంబున కొనియాడబడుచూ వుండెను. ఈమెకు అష్టమవర్షంబున సదరు ఉభయగో దావరిమధ్యయగు పుణ్యక్షేత్రంబున సదరు జిల్లా సదరు తాలూకాలోచేరిన ర్యాలిగ్రామనివాసులును ఆర్వేల నియోగిబ్రాహ్మణులును చిన్నకోట రామస్వామిశర్మగారి ధర్మపత్నియు పతివ్రతాతిలకమునునగు పేరమాంబాగర్భ జనిత పుత్రరత్నంబగు గోపాలమూర్తికి కామేశ్వరమ్మను

పరిణయముగావించ నిశ్చయించి ఉభయుల తలిదండ్రు లు విద్వజ్జన మహాజనులు ఉభయులకు వివాహమహోత్సవము అత్యుత్సాహముతో జరిపిరి. ఇటీవల కామేశ్వరమ్మ భర్త యగు గోపాలమూర్తి ర్యాలిగ్రామమునఁగల దివ్యక్షేత్ర మందు నివశించిన అద్భుత సుందరమూర్తియగు శ్రీ జగ న్మోహన కేశవుల దేవస్థానమునకు చాలాద్రవ్యము ఖర్చు పెట్టి స్వామికయింకర్యములుచేశి ఆ కేశవులకు చిన్ననాట నుండియు భక్తుడయి స్వామికృపకు పాత్రుడయి శ్రీ జగ న్మోహన కేశవదాసను అపరనామమును శ్రీ కేశవకటాక్ష వీక్షణమునపొంది పరమభక్తుడయి సర్వకాలములయందు తనమనోధనములు స్వామికి సమర్పించి అతిభక్తియుత్సా హముతోనుంటుండ.

ఈ యన ధర్మపత్నియగు కామేశ్వరమ్మను పతివ్ర తాతిలకము భర్తఆజ్ఞానుసారముగా వర్తించి భర్తవెంట నంటి సమస్తక్షేత్రములు తిరిగి అచ్చటగల పుణ్యానదుల నోలలాడి దివ్యదేశముల శేవించి సమస్తధర్మములు భర్త

చే(గహించి తన భర్తనే దైవముగా భావించి సర్వసేవలు సలుపుచు నొక క్షణమైన భర్తనువిడనాడి యుండక అపారమైన బ్రహ్మవిద్యను సాధించి అనుభవముచేత అన్ని హంశములను గుర్తెరిగి ప్రతిదేవీనవరాత్రముల యందును ప్రతిపౌర్ణమాస్యలయందును ప్రతి శుక్రవాసరముల యందును ప్రతిదివసమునందును తన భర్తగారితో యేకీభవించి శ్రీచక్రార్చనఅవిచ్ఛిన్నముగా బాలాసహస్రనామములచేతను లలితాసహస్రనామములచేతను శ్రీ చక్రార్చన వామాచారదక్షిణా చారములచేత అత్యుత్సాహముతో పరదేవతాప్రీతిగా అర్చనచేయుచు తనకుతోచిన కొలది యితరులకు బ్రహ్మవిద్యను బోధచేయుచు సర్వకాలములయందును బ్రహ్మవిద్యాపరిశ్రమ చేయుచు పురుషుని ఆశ్రయించి విడనాడకయుండు ఛాయవలెనే సర్వకాలములయందు భర్తనెడబాయక భర్తఆజ్ఞానుసారముగా సంచరించి యీమెకు కలిగిన జ్ఞానమంతయు భర్తవలననే గ్రహించి కాలముగడుపుటయే గాక రాత్రింబవళ్లు బీదసా

ధులకు మార్గస్థులకు పెద్దలకు వందనములు చేయుచు తన యింటికివిచ్చేయు అతిథిఅభ్యాగతులకు వందన ములు సమర్పించి అందరికి అన్నదానము చేయుచు యింకావచ్చిన పెద్దలు మొదలగువారికి అన్నివిధముల పాదపూజచేసి వారిని సంతుష్టిపరచి అత్యుత్సాహముతో కాలము గడుపుచు ఆమెజన్మస్థానముగు గోపాలపుర గ్రా మములో నివసించుచు యిక్కడ సత్రముపెట్టి యీగ్రామ మునంటి వెడలిన గన్నవరం కాలువగుండా విచ్చేయు రహ దారీపడవలమీాద జనులకు అవిచ్ఛిన్నముగా అన్ని జాతి ములవారికి అన్నదానముచేయుచు తీరికగానున్న సమయ ములలో శ్రీశివనామము, రామతారకము, గురురహస్య మను పరబ్రహ్మ సాక్షాత్కారము, మొదలగు కొన్ని చరి త్రములుగాను పాటలుగాను అద్వైతపరముగా బహుసుల భశైలిగా అందరికి తేటతెల్లముగా తెలియునటుల ఆమె స్వయముగా రచించి అచ్చొత్తించ యుత్సాహపడుచు కాళయుక్తి సంవత్సర ఆశ్వీయుజ శు ౧౧ మంగళవాసరము

మధ్యాహ్నము మూడుఘంటలకు దేవీనవరాత్రి దినములు అయినందున కుంకుమపూజచక్రార్చన చేయుచు అనాయాసముగా భర్తనువిడనాడి మోక్షపదవి జెందినది. గాన ఆమెచేరచింపబడిన చరిత్రలు విన్నకోట గోపాలమూర్తిఅనే శ్రీ జగన్మోహన కేశవదాసుయగు ఆమెభర్త ఆమె కోరికను నెరవేరునటుల అచ్చొత్తించి ప్రకటనచేయుచున్నాడు. ఆర్యులగు స్త్రీపురుషులు యీశిననామమును చదివిన చదువరులందరు అజ్ఞానియగు అంగనామణిచే చేయబడిన నామముగనుక తప్పులున్న యెడల క్షమించి తప్పులు విడనాడి ఒప్పులుగ్రైకొని తప్పులు సవరించుటకు ఆజ్ఞయిచ్చిన యెడల సవరణచేయుచున్నాడు.

ఇట్లువిన్నవించు తమవిధేయుఁడు,

విన్నకోట గోపాలమూర్తిఅనే శ్రీ జగన్మోహన కేశవదా.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీసద్గురవేనమః.

# శ్రీ శివునకు ప్రదక్షిణ చేయునప్పుడు పఠించు స్తోత్రము.



శ్లో॥ యానికానిచపాపాని జన్మాంతరకృతానిచ। తాని తానిప్రణస్యంతి ప్రదక్షిణపదేపదే। పాపోహంపాపకర్మాహం పాపాత్మా పాపసంభవ। త్రాహిమాంకృపయాదేవ శరణాగతవత్సల। అన్యధాశరణంనాస్తి త్వమేవశరణంమమ। తస్మాత్ కారుణ్యభావేన రక్షరక్షమహేశ్వర॥

"శ్రీశివుని దర్శించునపుడు పఠించుస్తోత్రము"

శ్లో॥ వందేశంభుముమాపతిం సురగురుంవందేజగత్కారణం। వందేపన్నగభూషణం మృగధరం వందేపశూనాంపతిం। వందేసూర్యశశాంకవహ్నినయనం వందేముకుందప్రియం। వందేభక్తజనాశ్రయంచవరదం। వందేశివంశంకరం॥

శ్లో॥ శంకరశ్చరితాకథామృతం చంద్రశేఖరగుణాను కీర్తనం। నీలకంఠతవపాదసేవనం సంభవంతుమమజన్మజన్మని॥ కోటయోబ్రహ్మహత్యానాం అగమ్యాంగమకోటయ। సద్యఃప్రళయమాయాంతి మహాదేవేతికీర్తనం। మేరుకాంచనదత్తానాం గవాంకోటిశతైరపి। పంచకోటితురంగానాం। తత్ఫలంశివదర్శనం॥

శ్లో॥ నవశ్శివాభ్యాం నవయవ్వనాభ్యాం పరస్పరాశ్లిష్టవపుర్ధరాభ్యాం। నగేంద్రకన్యావృషకేతనాభ్యాం నమోనమశ్శంకరపార్వతీభ్యాం॥

శ్లో॥ ఆత్మాత్వంగిరిజాపతిస్సహచరాః। ప్రాణాశ్శరీరంగృహం। పూజాతెవిషయోపభోగరచనా నిద్రాసమాధిస్థితిః।సంచారః పదయోః ప్రదక్షిణవిధిఃస్తోత్రాణిసర్వాగిరో యద్యత్కర్మకరోమితత్తదఖిలం శంభోతవారాధనమ్॥

శ్లో॥ పౌరోహిత్యంరజనిచరితం గ్రామణిత్వంనియోగం మాఠాపత్యంహ్యనృతవచనం సాక్షివాదఃపరాన్నమ్। బ్రహ్మద్వేషఃఖలజనరతిః ప్రాణినాంనిర్దయత్వం। మాభూ

ద్దటమమపశుపతే జన్మజన్మాంతరేషు । క్షంతవ్యోమేపరాధ
శివశివశివభో శ్రీమహాదేవశంభో॥

శ్లో॥ కరచరణకృతంవాకర్మవాక్కాయజంవా । శ్రవణనయనజంవా మానసంవాపరాధమ్ । విహితమవిహితంవా సర్వమేతత్క్షమస్వ । శివశివకరుణాబ్ధే శ్రీమహాదేవశంభో॥

ఓం నమశ్శివాయ

శిధం నమః

# శ్రీ శివనామ ప్రభావము.

శ్రీకరంబగు మోక్షపురికి నివాసమైనది శివునినామం పరమఋషులకు ప్రాణపదమై బరగుచున్నది శి॥ ౨ పరమకళ్యాణప్రదంబగు పరమగోప్యము శి॥ ౩ భక్తితోపఠింయించువారికి ముక్తియొసగును శి॥ ౪ రజితగిరిపతిసతికిమిక్కిలి రక్తిగలిగిన శి॥ ౫ ముక్తిమార్గమునిచ్చుటకు బహుయుక్తి

తెలుపును శి॥ ౬ భుక్తిముక్తులు రెండునొసగ ప్రశస్తమై
నది శి॥ ౭ శక్తికొలదినిస్మరణచేసితే శుభములొసగును శి॥ ౮
మూడులోకంబులకుమిక్కిలి మూలమైనది శి॥ ౯ యేడువ్య
సనములనుహరించెటి యోగసూత్రము శి॥ ౧౦ రాగ
భోగాదులకునెప్పుడు రమ్యమైనది శి॥ ౧౧ మనసుత్యాగ
ముజేసితె మరిసుఖమునిచ్చును శి॥ ౧౨ కుండలిని
భేదించువారి కఖండపదవియు శి॥ ౧౩ మండలత్రయ
మందుమిక్కిలి మెరయుచున్నది శి॥ ౧౪ అండపిండబ్ర
హ్మాండమంతట అమరియున్నది శి॥ ౧౫ రెండునొక్కటిజే
యువారికి పండువెన్నెల శి॥ ౧౬ రెండుదళములకమలమం
దున నిండియున్నది శి॥ ౧౭ రెండుఅక్షరమంత్రములచే
వెలయుచున్నది శి॥ ౧౮ మేరుచక్రాంతరమునందున మెర
యుచున్నది శి॥ ౧౯ వారువీరనియెంచుజనులకు వశము
గానిది శి॥ ౨౦ కాలమును దేశమునుయెప్పుడు గానరా
నిది శి॥ ౨౧ ఫాలనేత్రము తెరచిచూచిన వారిభోగము
శి॥ ౨౨ కామరాగాదులకునెప్పుడు కానరానిది శి॥ ౨౩

సోమసూర్యాగ్నులనుమించిన స్వప్రకాశము శి॥ ౨౪ సత్తుచిత్తానందములకును స్థానమైనది శి॥ ౨౫ వర్తిలేని జ్యోతితానై వెలుగుచున్నది శి॥ ౨౬ నిర్వికారమునిష్క-ళంకము నిర్విశేషము శి॥ ౨౭ నిర్గుణంబై వెల్గుచునుమరి నిత్యమైనది శి॥ ౨౮ సర్వకాలములందుబోలయని సత్యరూపము శి॥ ౨౯ సమరసైక్యానందపరులకు సర్వసిద్ధియు శి॥ ౩౦ సగుణనిర్గుణరూపములకును స్థానమైనది శి॥ ౩౧ పగలురేయింబవలులేకను ప్రబలుచున్నది శి॥ ౩౨ తారకబ్రహ్మానుభవులకు తత్వమైనది శి॥ ౩౩ నారదాదిమునీంద్రులకును సిధానమైనది శి॥ ౩౪ లింగధారణచేయుభక్తుల సొమ్ము సుమియీ శి॥ ౩౫ గంగయమునలమధ్యమందున సంగమముయిదీ శి॥ ౩౬ రంగుగాహృదయాబ్జమున నుప్పొంగుచున్నది శి॥ ౩౭ గంగశిరమునతాండమాడి చెలంగుచున్నది శి॥ ౩౮ అందమైనచందమామకు ఆస్థానము శి॥ ౩౯ సుందరంబగుబిందువందున సుస్థిరముయిదీ శి॥ ౪౦ శైవమతముకుస్థానమైబహు సిద్ధియొసగును శి॥ ౪౧ శైవపంచాక్షి

రివఠించిన వారిభోగము శి॥ ౪౨ తత్వమశియను వాక్య మందున తాండమాడును శి॥ ౪౩ అహంబ్రహ్మాస్మియనుటకు అర్థమేయీ శి॥ ౪౪ ఆస్తికత్వములేనివారికి నాస్తిఘని యీ శి॥ ౪౫ శివశివోహంయనుచుపలికిన సిద్ధియొసగును శి॥ ౪౬ ప్రజ్ఞానంబ్రహ్మమనుచును ప్రబలియున్నది శి॥ ౪౭ అజ్ఞానమువదలువారికి అర్థమౌయీ శి॥ ౪౮ అయమాత్మాబ్రహ్మమైనది ఆనుచున్నది శి॥ ౪౯ అయిదుఅందులు చురవదైదై అచలమైనది శి॥ ౫౦ సోహమనుచునుపలుకుచున్నది దేహమందున శి॥ ౫౧ హంసోహమనుచునుజపముచేశితె అంతానా శి॥ ౫౨ ఖేచరిముద్రయందు నిదానమైనది శి॥ ౫౩ వాచామగోచరంబై నరలుచున్నది శి॥ ౫౪ పక్షపాతములేనివారి పక్షమైనది శి॥ ౫౫ అక్షియందునిదానమెరిగిన వారిపశమీ శి॥ ౫౬ అక్షిపురుషోపాసకులకు అమృతబీజము శి॥ ౫౭ సాక్షిగణపతిస్థానమందు నివాసమైనది శి॥ ౫౮ కుక్షిలోపలకోర్కెలొసగ ప్రశస్తమైనది శి॥ ౫౯ నీలతోయదమధ్యమందున నిలచి

యున్నది శి॥ ౬౦ మెరుపుమెరయుచున్నరీతిని వెలుగు
చున్నది శి॥ ౬౧ నీవారసూకమయ్యును నిశ్చలంబౌ
శి॥ ౬౨ పీతవర్ణముఁబోలియును అణురూపమైనది శి॥ ౬౩
శిఖామధ్యమునందు వెలిగె చిత్స్వరూపము శి॥ ౬౪ బ్రహ్మ
విష్ణుశివాత్మకంబై ప్రబలుచున్నది శి॥ ౬౫ క్షరాక్షర
రూపమైనపరమ స్వరాట్టయినది శి॥ ౬౬ సాలెపురుగు
సర్పము కరిరూపమైనది శి॥ ౬౭ శ్రీకాళహస్తీశ్వరుతా
నై కరుణయొసగిన శి॥ ౬౮ మార్కండేయుని కోర్కె
లొసగియు మృత్యువునుబాపిన శి॥ ౬౯ గజాసురునిసంహ
రించి గజచర్మముధరించిన శి॥ ౭౦ కన్నప్పకన్నులుచ్చుకు
కైవల్యమొసగిన శి॥ ౭౧ మాలకన్నడియంగిలికి మదిసంత
సించిన శి॥ ౭౨ భల్లానునిభక్తిమెచ్చియు ముక్తియొసగిన
శి॥ ౭౩ కాలకూటముకంఠమందున దాల్చియున్నది శి॥ ౭౪
కాలమృత్యువుచేతచిక్కని వరములొసగును శి॥ ౭౫ రామ
తారకరసముపానము జేయుచున్నది శి॥ ౭౬ దక్షయజ్ఞ
ధ్వంసమునకును కారణమయినా శి॥ ౭౭ ధరణిలోపలమూ

ధమతులకు దుర్లభముయిూ శి॥ ౨౮ దారితప్పకనడచు వారికి దర్శనముయిూ శి॥ ౨౯ చియ్యాళునిభక్తిగనుగొని చింతబాపిన శి॥ ౩౦ చిత్కళాసాక్షాత్కారమై శిద్ధులొసగెటి శి॥ ౩౧ ఆదిమధ్యాంతరహితమై అచలమైనది శి॥ ౩౨ ఆదిఅనాదులును తానై అంటుకున్నది శి॥ ౩౩ ధరనుదత్తాత్రేయుడై దారిజూపిన శి॥ ౩౪ శంకరాచార్యులై మతములు మహినినిల్పిన శి॥ ౩౫ మహిని మండలమిూశ్వరునకును సన్యాసమొసగిన శి॥ ౩౬ దండిగాశ్రీశైలమందున నిండియున్నది శి॥ ౩౭ మెండుగారామేశ్వరములో మహిమగలిగిన శి॥ ౩౮ చిదంబరక్షేత్రమున ప్రత్యక్షమైనది శి॥ ౩౯ వారణాశిపురములోను నివాసమైనది శి॥ ౪౦ కోటిపల్లిని సోమేశ్వరుండై సూటిదెలిపిన శి॥ ౪౧ ముక్తేశ్వరంబునకుణామునిలిచిన ముక్తినిచ్చిన శి॥ ౪౨ పట్టిసములోవీరభద్రుని పట్టినిల్పిన శి॥ ౪౩ మహానందినిమహిమదెల్పి మసలుచున్నది శి॥ ౪౪ ముఖలింగేశ్వరుడుతానై అఘముబాపిన శి॥ ౪౫ ప్రకటయోగీంద్రులకునై నను

పట్టుబడనిది శి॥ ౯౬ మాసశివరాత్రినివశించిన వారిభో
గము శి॥ ౯౭ మంచిగురువులుపాలబడితే గానవచ్చును
శి॥ ౯౮ రుద్రాక్షధారణచేయువారిని భద్రపరచును శి॥
౯౯ భస్మధారణజేయువారికి వశ్యమగుయీ శి॥ ౧౦౦
రుద్రభూమినిసంచరించును రూఢిగాయీ శి॥ ౧౦౧ క్షుద్ర
మాపిశాచగణముల తోటిమసలును శి॥ ౧౦౨ కపాలశీ
ల్యములందుమిక్కిలి కాంక్షగలిగిన శి॥ ౧౦౩ సర్పహారము
చేతమిక్కిలి సంతసిల్లిన శి॥ ౧౦౪ శ్రీగిరిభ్రమరాంబవశమై
చెలగుచున్నది శి॥ ౧౦౫ అన్నపూర్ణాదేవికెప్పుడు ఆశ
గలిగిన శి॥ ౧౦౬ భద్రకాళివద్దనెప్పుడు ముద్దులొసగిన శి॥
౧౦౭ కంచికామాక్షికౌగిట కట్టుబడినది శి॥ ౧౦౮ అర్ధనా
రీశ్వరరూపమై అవతరించిన శి॥ ౧౦౯ కనకదుర్గకుస్థానమై
బహు కరుణగలిగిన శి॥ ౧౧౦ కైలాసభవనమందున కాపు
రముయీ శి॥ ౧౧౧ జంగమస్థావరములందున నాట్యమా
డెడిశి॥ ౧౧౨ నందివాహనమెక్కిజగములు యేలుచుండెడి
శి॥ ౧౧౩ కాలమనుపెనుభూతమును చేపట్టియున్నది శి॥

౧౧౪ జపమాలత్రిప్పివజనులమనమున జేరియున్నది శి॥
౧౧౫ సుషుప్తిలోపలసుఖముతానై చూచుచున్నది శి॥
౧౧౬ తుర్యమైతుర్యాతీతమై వెలుగుచున్నది శి॥ ౧౧౭
ఆశపాశములేని అచలస్వరూపమైనది శి॥ ౧౧౮ కాశిలో
పలవాసమైఘనతజెందిన శి॥ ౧౧౯ మూఁడునదులనుదాటు
వారికి ముక్తియిచ్చిన శి॥ ౧౨౦ కాటుకకొండలయందున
కాపురముయీ శి॥ ౧౨౧ కోటలేడునుదాటువారితో
మాటలాడును శి॥ ౧౨౨ జడలుదాల్చినజపితులైనను గా
నరానిదిశి॥ ౧౨౩ ఘడియలోగననచ్చుగురుని కభిముఖంబౌ
శి॥ ౧౨౪ ముసుకులోపలముసుకుతానై ముఱియుచున్నది
శి॥ ౧౨౫ కులములాచారంబులెన్న వారినంటదుశి॥ ౧౨౬
మలమూత్రపుతోలుబొమ్మలో మసలుచున్నది శి॥ ౧౨౭
మేలిమామేడలనుగోధన మంటకున్నది శి॥ ౧౨౮ వాడ
వాడలతిరిగిచూచిన కానరానిది శి॥ ౧౨౯ అవాంగ్మాన
సగోచరంబై అచలమైనది శి॥ ౧౩౦ కర్మమార్గముచేత
నెప్పుడు కానరానిది శి॥ ౧౩౧ జ్ఞానమార్గముచేతఝాములో

గానవచ్చును శి॥ ౧౩౨ ముద్రభావము తెలసిచూచితే ముచ్చటౌయీ శి॥ ౧౩౩ త్రిపురసుందరివశముచేసుకు తిరుగుచుండును శి॥ ౧౩౪ పంచదశిమంత్రా ముమందున పాదుకొన్నది శి॥ ౧౩౫ లలితయనుచునుపలవరించిన లక్ష్యమిచ్చును శి॥ ౧౩౬ పాదుకాంతాదీక్షపరులకు ఫలములిచ్చును శి॥ ౧౩౭ ఏకాంబ్రేశ్వరునియందు నివాసమైనది శి॥ ౧౩౮ దక్షవాటికయందు దీక్షగ దేజరిల్లును శి॥ ౧౩౯ పశుపతేశ్వరయనిన భువిలోపల్కుచుండును శి॥ ౧౪౦ బదరికేదారమందున భద్రమైనది శి॥ ౧౪౧ నిదురలోపలనిజముదెలశితె నిశ్చలంబౌ శి॥ ౧౪౨ కుంభలేశ్వరమందుచూడ నఖండపదవియు శి॥ ౧౪౩ రామేశ్వరక్షేత్రమందున రంజిల్లుచున్నది శి॥ ౧౪౪ రామలింగేశ్వరుడు తానై ముక్తియిచ్చేటి శి॥ ౧౪౫ పర్వతవర్ధనిదేవిమై లములిచ్చును శి॥ ౧౪౬ కోటిలింగాకారమై కోర్కెలొసగెటి శి॥ ౧౪౭ ఎందుజూచినలింగమయమై యేలుచున్న

ది శి॥ ౧౪౮ ముఖలింగేశ్వరుడుతానై ముచ్చటించిన
శి॥ ౧౪౯ గంగాధరాయనివచించిన గ్రామమిచ్చును శి॥౧౫౦
బిళ్వదళమందునెప్పుడు కాపురముయీా శి॥ ౧౫౧ కోటప్ప
కొండవద్దను కోటిప్రభలతోకోర్కెలొసగటి శి॥౧౫౨ బిల్వ
వనమునసిలిచిపిలచితె దర్శనంబా శి॥ ౧౫౩ సర్పహారము
మెడనుదాల్చుకు సంచరించును శి॥ ౧౫౪ బ్రహ్మశిరమును ఛే
దించినకర్మసూత్రము శి॥ ౧౫౫ గోచిలేకనుతిరుగుచుండును
గోష్యమాయీా శి॥ ౧౫౬ యెద్దునెక్కితిరుగుచుండును
యేమిచోద్యమొ శి॥ ౧౫౭ రుద్రాక్షజపముచేశితె వద్ద
నిల్చును శి॥ ౧౫౮ ఏకముఖ రుద్రాక్షదాల్చితె ఐక్య
మొనగును శి॥ ౧౫౯ పార్థివముచేశితేమిక్కిలి ఫలములిచ్చు
నుశి॥ ౧౬౦ వ్యాఘ్రచర్మాంబరధరుండని బిరుదుకలిగిన
శి॥౧౬౧ త్రిశూలముచేతపుచ్చుకు తిరుగుచుండును శి॥౧౬౩
భస్మధారణచేయువారికి భుక్తులొసగును శి॥ ౧౬౪ మూ
ఢకన్నులుకలిగిమిక్కిలి ముటికియుచుండును శి॥ ౧౬౫ వా

దవాడలతిరుగుచుండును జాడతెలియని శి॥ ౧౬౬ చాత్ర
ఘంటాశంఖముచ్చుకు తిగిపెమొత్తును శి॥ ౧౬౭ జంగమ
య్యాగిజగములెల్లను చాటుచుండిన శి॥ ౧౬౮ నందిశృంగ
మధ్యమునుండిచూచితే సూటుతెల్పును శి॥ ౧౬౯ యురు
కర్తై పార్వతికిశకున ఫలముచెప్పిన శి॥ ౧౭౦ అర్ధనారీశ్వర్ధ
త్వాన్నై అమరియున్న శి॥ ౧౭౧ కుక్కుటేశ్వరుడయ్యెజను
లకు కోర్కెలొసగిన శి॥ ౧౭౨ గౌతమీవాశిష్టమధ్యను
వాసిలిపురమున శి॥ ౧౭౩ జగన్మోహనకేశవుని మాయలో
బడి శి॥ ౧౭౪ బ్రహ్మకమండలోద్భవుండై యెదుటనిల్చిన
శి॥ ౧౭౫ బ్రహ్మగుండక్షేత్రమందున బయలువెడలిన
శి॥ ౧౭౬ విన్నకోటవంశమందున వెలసియున్నది శి॥ ౧౭౭
గోపాలదాసునిహృదయమందున నిలిచియున్నది శి॥ ౧౭౮
వారికిధర్మపత్న్యగుకామేశ్వరమ్మకు వరముఁగొసగిన శి॥౧౭౯
ర్తగారిఆజ్ఞచేతను పాటచేశితి శి॥ ౧౮౦ యీనా
మములుభక్తిశ్రద్ధతో యెవ్వరువ్రాశివదివిన శి॥ ౧౮౧

భుక్తిముక్తులనొసగి ప్రత్యక్షమౌగద శి॥ ౧౨ నూట
యెనుబదిఆరునామాల్ భవునకుమాలగూర్చితి శి॥ ౧౩
యింపుతోఁడుతశివుని మెడను హారమువేశిచేశితి శి॥ ౧౪
మంగళముశ్రీసాంబమూర్తి మంగళముశ్రీపార్వతికిని.
మంగళము శ్రీశుభమంగళము యీ శివునినామం॥ శ్రీశ్రీ

"అథ శివపంచాక్షరీస్తోత్రప్రారంభః"

శ్లో॥ ఓంకారబిందుసంయుక్తం నిత్యంధ్యాయంతియో నరః। కామదంమోక్షదంతస్మై దోంకారాయనమోనమః॥ ౨॥ ఓంనం॥ నమంతిమునయస్సర్వే నమంత్యప్సరసాగణాః। నరాణామాదిదేవానాం నకారాయనమోనమః॥౩॥ఓంమం॥ మహాతత్త్వంమహాదేవ ప్రియంజ్ఞానప్రదంపరమ్। మహాపాపహారంతస్మాన్మకారాయనమోనమః ॥ ౪ ॥ఓంశి॥ శైవం శాంతంశివాకారం శివానుగ్రహకారణమ్ మహాపాపహరం తస్మాచ్ఛికారాయనమోనమః॥ ౫ ॥ఓంవాం॥ వాహనం

వృషభంయస్యా వాసుకీకంఠభూషణమ్। వామశక్తిధరం దే
వంవకారాయనమోనమః॥ ౬ ॥ఓం యం॥ యకారేసంస్థి
తోదేవః యకారంపరమంశుభం యన్నిత్యపరమానందం
యకారాయనమోనమః॥ ౭ ॥ శ్లో॥ యత్క్షీరాంబుధి మం
దనోద్భవమహాహాలహాలంభీకరం। దృష్ట్వాతత్రపలాయితా
స్సురగణా నారాయణాదీంస్తదా। యఃపీత్వాపరిపాలయా
జ్జగదిదంవిశ్వాధికంశంకరం। సేవ్యత్వంసకలాపదః పరిహార
న్కైలాసవాసీవిభుః॥ ౮ ॥ షడక్షరమిదంస్తోత్రంయః పఠె
చ్ఛివసన్నిధౌ। తస్యమృత్యుభయంనాస్తి హ్యాపమృత్యు
భయంకుతః ॥౯॥యత్కృత్యంతన్నకృతం యదకృత్యంకృత్య
వత్తదాచరితమ్ ఉభయోఃప్రాయశ్చిత్తం శివతవనామా
క్షరద్వయోచ్చరితమ్॥ ౧౦ ॥శివశివేతిశివేతివాభవభవేతిభ
వేతివా।హరహరేతిహరేతివా భజమనశ్శివమేవనిరంతరమ్॥

శ్రీశంకరాచార్యకృతపంచాక్షరీస్తోత్రం సమాప్తం.

---

## " శ్రీ శివాపరాధస్తోత్రం "

శ్లో॥ చంద్రోద్భాశిత శేఖరేస్మరహారేగంగాధరేశంకరే। సర్పైర్భూషితకర్ణకంఠకుహరే నేత్రోత్థవైశ్వానరే। దంతిత్వక్కృతసుందరాంబరధరే త్రైలోక్యసారేహరే। మోక్షార్థంకురుచిత్తవృత్తి మమలామన్యైస్తుకిం కర్మభిః। ౧౧॥ క్షంతవ్యోమేపరాధశ్శివశివశివభో శ్రీమహాదేవశంభో కింయానేనధనేనవాజికరిభిః ప్రాప్తేనరాజ్యేనకిం। కింవాపుత్రక ళత్రమిత్రపశుభిర్దేహేనగేహేనకిం। జ్ఞాత్వైతత్క్షణభంగు రంసపదహిత్యాజ్యంమనోదూరతః। స్వాత్మార్థంగురువాక్య తోభజమనశ్రీపార్వతీవల్లభమ్॥ క్షంతవ్యోమేపరాధశ్శివశి వశివభో శ్రీమహాదేవశంభో॥ ౧౩ ॥ ఆయుర్నశ్యతిపశ్య తాంప్రతిదినం యాతిక్షయంయౌవనం। ప్రత్యాయాంతిగ తాఃపునర్నదివసాఃకాలోజగద్భక్షకః। లక్ష్మీస్తోయతరంగభం గచపలావిద్యుచ్చలంజీవితం। తస్మాన్మాం శరణాగతంకరుణ

యాత్వంరక్షరక్షాధునా॥ క్షంతవ్యోమేపరాధ శ్శివశివ శివభో శ్రీమహాదేవశంభో॥

శంకరాచార్యకృత శివాపరాధక్షమార్పణస్తోత్రం సంపూర్ణము.

శ్రీ. శ్రీ. శ్రీ.



# ప్రకటన.

"శ్రీ శివనామ మను పుస్తకమందు శివపంచాక్షరీ స్తోత్రము, శివాపరాధక్షమార్పణ స్తోత్రమున్ను, శివుని దర్శించునపుడు, శివునికి ప్రదక్షిణము చేయునపుడు పఠించవలసినశ్లోకములు గలవు. సులభశైలి. శివనామమాహాత్మ్య మెల్లరకుఁ దెలిసినదేగాన అందునుగురించి విస్తరించలేదు.

ఇంకను మావద్ద వెలకుదొరుకు గ్రంథములు.

| | | |
|---|---|---|
| 1. శివనామము. | ... | 0—2—0 |
| 2. రామతారకము. | ... | 0—3—0 |
| 3. గురురహస్యమను, పరబ్రహ్మసాక్షాత్కారము | | 0—8—0 |

☞ ఇంకను పుస్తకములు గలవు. పోస్టేజి ప్రత్యేకము.

పుస్తకములకు వ్రాయువారు—

## ఆచంట సూర్యారావుగారు.

ఏలూరు, పవరుపేట,

కృష్ణాజిల్లా అని వ్రాయవలెను.